# విద్యాసంగ్రహము.

—(౦)—

మేలు గలిగించు సాధనములందెల్ల ముఖ్య ప్రమాణము శబ్దము. అట్టి శబ్దములలో ధర్మంబు దెలుపు శబ్దము ముఖ్యము. అది ధర్మస్థానంబనియు విద్యాస్థానంబనియుం జెప్పంబడును. ధర్మము దెలుపునది ధర్మస్థానము. విద్యను దెలుపునది విద్యాస్థానము. ఇట్లుండ ధర్మస్థానమే విద్యాస్థానం బగు టెట్లన్నను. విద్యయనంగా తెలివి. అది ధర్మంబు గోచరించినయెడనే సార్థకంబగును. లేనిచో విద్యయనందగదు. కావున ధర్మస్థానంబె విద్యాస్థానంబనం బడుచున్నది. బ్రహ్మజ్ఞానంబు విద్యయగుంగదా. అది ధర్మగోచరంబుగాదే యని శంక పుట్టును. బ్రహ్మము సిద్ధధర్మంబండ్రుగాన నదియు ధర్మగోచరంబనవచ్చును. (శ్లో) యేచ వేదవిదో విప్రా యేచాధ్యాత్మవిదోజనాః। తేవదన్తి మహాత్మానం కృష్ణంధర్మంసనాతనమ్. అనియు. రామో విగ్రహవాన్ ధర్మః. అనియు నిట్లు ప్రమాణములు గలవు.

ధర్మపరిత్రాణమునకై యవతరించిన వారలుగాన రామకృష్ణాదులనట్లు లాఋషులుగాం జెప్ప

యున్నారుగాని బ్రహ్మను నిజముగా ధర్మంబనంబ
డదన్నను బ్రహ్మజ్ఞానంబొకండెవదివలయుననుకోర్కె
యొకండె ధర్మసాధ్యంబుగాన బ్రహ్మవిద్యం గలిగిం
చునదియు ధర్మంబు దెలుపుంగాన నదియు ధర్మ
స్థానంబగుంగాన విద్యాస్థానంబులన్నియు ధర్మ
స్థానంబులగును.

అట్టి విద్యాస్థానంబులెయ్యవియన్నను వేదములు
నాల్గు నంగములాఱు నుపాంగములు నాల్గును గూడి
పదునాల్గు- (శ్లో) పురాణన్యాయమీమాంసా ధర్మ
శాస్త్రాంగమిశ్రితాః। వేదాస్స్థానాని విద్యానాం ధర్మ
స్యచచతుర్దశ- అనుయాజ్ఞవల్క్యస్మృతి అ. ౩ శ్లో)
విద్యాస్థానంబులే విద్యలనియుం జెప్పంబడు
ను- (శ్లో) అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యా
యవిస్తరః। పురాణం ధర్మశాస్త్రంచ విద్యాహ్యే
తాశ్చతుర్దశ- అని విద్యాస్థానములను చెప్పవలసినచో
విద్యయని చెప్పంబడినది.

ఇట్లు పదునాల్గు విద్యాస్థానంబులు సుప్రసిద్ధము
లు- మఱినాల్గు విద్యాస్థానములు గూర్చి పదునెనిమి
దివిద్యలనియుం జెప్పుదురు అవి యాయుర్వేద ధనుర్వేద
గాంధర్వవేదార్థశాస్త్రంబులు- (శ్లో) ఆయుర్వేదో
ధనుర్వేదో వేదో గాంధర్వ ఏవచ। అర్థశాస్త్రం చత
స్రస్సర్విద్యాహ్యష్టాదశైవతాః- అనువచనముగ

ంకు- ఈ నాల్గును వేదంబులనియు నండ్రు.

ఇందు వేదములు ఋగ్యజుస్సామాథర్వవేదములు నాల్గు- అందు పాదనియమముగల మంత్రములు ఋక్కులు- గానముగలవి సామములు- కేవల వాక్యరూపములు యజుస్సులు- ఇట్లు మంత్రములు మూడువిధములు- ఋఙ్మంత్రబహుళము ఋగ్వేదము- యజుర్మంత్రబహుళము యజుర్వేదము- సామమంత్ర బహుళము సామవేదము. పౌష్టిక శాంతికాదివిధుల కుపయుక్తంబులగు మంత్రములు తరుచుగా నుండు వేదమథర్వవేదము. ప్రతివేదమును మంత్రభాగంబెగాక బ్రాహ్మణభాగంబుం గలదు. ఒక్కొక్క వేదము శాఖాభేదంబుల నానావిధంబయ్యె నా శాఖలు శాఖాసంగ్రహమునం దెలుపంబడినవి.

ఇట్టి నాల్గు వేదములును ధర్మంబు దెలుపుటకు మూలప్రమాణములు- వేదములు దురవగాహములు గాన వానితాత్పర్యములు వివరించుటకు సాధనములే యంగోపాంగంబులు.

అంగోపాంగవ్యవహారమే యంగములు ముఖ్యంబులనియు నందదనుక్తాంశంబుల నుపాంగంబులు వివరించుననియుం దోపించును-

శిక్షా వ్యాకరణ నిరుక్త చ్ఛందః కల్ప సూత్ర జ్యోతిషంబులను నాఱు నంగములు.

అంగశిక్ష యక్షరంబులఁబలుకుచో సాధ్వ సాధువివేకముఁ గలిగించును అది వ్యాసశిక్ష - భరద్వాజశిక్ష - నారదశిక్ష - పాణినీయశిక్ష మొదలగునది.

వ్యాకరణంబునఁ బదంబుల ప్రకృతి ప్రత్యయ విభాగంబు సామాన్యవిశేషాకారంబులం దెల్పంబడి తన్ముఖంబునఁ బదార్థంబు దెలియఁగను పాయముఁ గల్పించును - ఉ - భృ ధాతువుపైఁ గర్త్రర్థంబున తృచ్ప్రత్యయమువచ్చునని సామాన్యాకారంబునఁ దెల్పుటచేత భృ ధాతువుపై నతృచ్ప్రత్యయంబు వచ్చుచో భర్తృశబ్దంబగుననియు హృ ధాతువుపై నతృచ్ప్రత్యయంబువచ్చుచో హర్తృశబ్దంబగుననియుం దెలియంబడును - అటపైని భృ ధాతువు భరించుటం జెప్పుటయు తృశబ్దము దానికర్తం జెప్పుటయుంబట్టి భరించువాఁడనునర్థము దెల్లమగును. హృ ధాతువు హరించుటం జెప్పుంగాన హర్తృశబ్దము హరించువానిం జెప్పునని దెలియవచ్చును.

దానదీప్త్యాదులం జెప్పు దివుధాతువుపైఁ గర్త నుజెప్పు నచ్ప్రత్యయము వచ్చుటచే దేవశబ్దంబుపుట్టుటం జేసి యిచ్చువాఁడు దీపించువాఁడని యిట్టియర్థముం జెప్పుచుండునని తెలియవచ్చును - పాణినీయము కాలాపము చాంద్రము మొదలగు వ్యాకరణములనేకములుగలవు అందు పాణినీయము శ్రేష్ఠము.

నిరుక్తము వ్యాకరణలభ్యంబగు పదార్థము ను విశదముగాఁ దెలుపుచుండును. ఉ. దేవో దానా ద్వా దీపనాద్వా - అను నిరుక్తము - ఇచ్చుట నుండి దీపించుటనుండి దేవశబ్దము పుట్టెనని చెప్పుచున్న ది. యాస్క శాకపూణి ప్రభృతులు నిరుక్తకర్తలు.

ఛందము ఛందోభేదంబులం దెలుపు - ఛందము లనఁగా నక్షరంబుల సముదాయములు - గాయత్రి ఉష్ణిక్కు అనుష్టుప్పు మొదలగునవి. ఇన్ని యక్షరములయినచో నీ ఛ్ఛందంబని ఛందము తెలుపును - ఉ - ఇరువది నాల్గక్షరంబులు గలిగి యెనిమిదేసి యక్షరంబులవి మూడు పాదములు గల్గుచో గాయత్రి యని యీ ఛాస్త్రనఁ దెలుపును - అది పింగళనాగ సూత్రము మొదలగునది -

వేదమున విధింపంబడిన యజ్ఞాదుల యంగములక్కడక్కడ విశకలితముగా నుండుట నవియన్నియు వరుసగాఁ గలిసి నడుచుట క్లేశముగాన వాని వరుస సులభంబుగాఁ దెలుపునది కల్పసూత్రము - అది శ్రౌతసూత్రంబనంబడును - బోధాయనాశ్వలాయనాపస్తంబ ద్రాహ్యాయన భరద్వాజ సత్యాషాఢ హిరణ్యకేశ్యాది సూత్రంబులు కల్పసూత్రములు -

వేదమునందు [illegible] యజ్ఞాది కర్మంబులకు విధిం

ధిన కాలములం దెలిసి కొనుటకు సాధనంబులగు గ్ర
హనక్షత్రాదుల విపర్యయంబులం దెలియుటకు గణి
తాది సాధనంబులం దెలుపునది జ్యోతిషము- అదిసి
ద్ధాన్త సంహితా హోరా భేదంబులు మూడువిధంబు
లనుండును అవి వరుసనే గ్రహాది సంచారంబులును
శుభాశుభ కర్మంబులకుంగాల నియమంబును జాత
క ఫలంబులును దెలుపును- సూర్యసిద్ధాంత సోమసి
ద్ధాంత బ్రహ్మసిద్ధాంత వసిష్ఠ సిద్ధాన్తాదులు సిద్ధాంత
ములు - కశ్యపసంహిత గర్గసంహిత మొదలగునవి
సంహితలు - పారాశర్య హోర మొదలగునవి
హోరలు.

పురాణ న్యాయమీమాంసా ధర్మశాస్త్రం
బులుపాంగంబులు-

అందు సర్గప్రలయ వంశ మన్వంతర వంశా
ను చరితంబులం జెప్పునవి పురాణములు.

బ్రాహ్మ బ్రహ్మాండ బ్రహ్మవైవర్త భాగవత భవి
ష్యోత్తర మాత్స్య మార్కండేయ - వామన విష్ణువారా
హ వాయవ్య- స్కాన్దాగ్నేయ గారుడ పాద్మనార
ద లైఙ్గ కూర్మపురాణంబులని పదునెనిమిది పురా
ణంబులు.

వాని ననుసరించి యుపపురాణంబులుం బుట్టెన
వి- సనత్కుమార నారసింహ శివ ధర్మ విష్ణుధర్మో

మ ఉపపురాణంబులు.

వస్తుతత్త్వంబు దెలియుచోఁగలుగు సంశయవివాదంబులందీర్చుటకుం దగిన సాధనము న్యాయశాస్త్రము-అదియె యాన్వీక్షికి అదిగౌతమసూత్రమండ్రు.

వేదంబునందుఁ బొడము సంశయంబులం దీర్చు విచారము సేయు శాస్త్రము మీమాంస-అందుం బూర్వమీమాంసయు నుత్తర మీమాంసయు ననిరెండు భేదములు గలవు- కర్మభాగ విచారము సేయునది పూర్వమీమాంస- అది జైమిని కృతము- బ్రహ్మభాగ విచారంబు సేయునది యుత్తర మీమాంస-అది వ్యాసకృతము- అదియె బ్రహ్మసూత్రంబండ్రు-

ధర్మశాస్త్రంబనఁగా మన్వాదులు చెప్పిన ధర్మంబులం దెలుపు గ్రంథము- అదియె స్మృతియనంబడును- అవి మన్వత్రి విష్ణు హారీత యాజ్ఞవల్క్యాది స్మృతులని ప్రసిద్ధములు-

శరీరంబునకుం గలుగు రోగాదిబాధలం దీర్చి సంరక్షించు నుపాయంబులం దెలుపునది యాయుర్వేదము-అదియె వైద్యశాస్త్రంబండ్రు- అది ధన్వంతర్యాత్రేయ చరకసుశ్రుతాదిసంహితా రూపంబున ననేక విధము.

రాష్ట్రంబులకు శత్రుచోరాదులవలనఁ గలుగు నుపద్రవంబులం దీర్చు ధనురాద్యాయుధ సాధ

సంబులం దెలుపునది ధనుర్వేదము.

పురుషార్థ సాధనంబులగు ప్రబంధముల సర్వసాధారణముగా వినిపింపఁ గావించు నాట్యప్రబంధంబులం బ్రయోగించుటకు సాధనంబగు స్వరశాస్త్రాదులం దెలుపునది గాంధర్వవేదము. అదియె సంగీతశాస్త్రంబండ్రు. అది భరతకృత శాస్త్రంబు మొదలగునది.

సకల పురుషార్థంబులకును సాధకంబగు నర్థసంపాదనంబున కనుకూలంబగు నీతులం దెలుపు శాస్త్రమర్థశాస్త్రము అదియె దండనీతి అది శుక్రనీతి బృహస్పతి నీతి మొదలగునది.

ఇట్లు సామాన్యాకారంబున విద్యాస్వరూపంబులు దెలుపంబడినవి.

కానివాని సవిమర్శనంబుగాఁ దెలియవలయు నన్నచో నస్మత్కృతంబులగు వేదసంగ్రహ శాఖాసంగ్రహ వర్ణసంగ్రహ పదసంగ్రహ ఛందస్సంగ్రహ జ్యోతిషసంగ్రహ యజ్ఞసంగ్రహాదులం జూచునది.

ఇది శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులయ్యవారలుఁగారిచే రచియింపఁబడిన విద్యాసంగ్రహము.

---

VIZAGAPATAM.
Printed by A. C. Srinivasacharier.
Arsha Press. 1874.

